విశ్వసాహిత్యమాల - 51.

# వానరుడు - నరుడు:

## పరిణామక్రమంలో కర్మ పాత్ర.

## ఫ్రెడరిక్ ఏంజిల్సు

అనువాదం:

మహీధర జగన్మోహనరావు

విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

వెల 0-6-0

ప్రథమ ముద్రణ - అక్టోబరు 1951
ద్వితీయ ముద్రణ - ఏప్రిల్ 1953

ప్రపంచ కార్మికులారా ! ఏకముగండు !!

ఏంగిల్సు మహాశయునిచే 1876 లో రచింపబడి, 1896 లో మొదట న్యూజీత్ లో ప్రచురించబడిన వ్యాసంనుంచి. మాస్కో-లోని మార్క్సు-ఏంగిల్సు-లెనిన్ ఇన్‌స్టిట్యూట్‌లో భద్రపరచబడిన వ్రాతప్రతి నాధారంగా గొని, ఇంగ్లీషులో "ఫారెన్ లాంగ్వేజస్ పబ్లిషింగ్ హౌస్ - మాస్కో" వారు ప్రచురించిన కరపత్రంనుంచి అనువదించబడినది.

అవంతీ ప్రెస్, రాజమండ్రి.

# స్వవిషయం

1953 ఆగస్టు 15 శనివారం రాజమండ్రి పరిసరాలన్నీ గోదావరీ జలాలతో నింప నారంభించేయి. ఇంతవరకెన్నడూ యింత వుధృతంగా గోదావరి వచ్చిందేలేదు. తీరవాసులు యీ జలప్రళయానికి తల్లడిల్లిపోయేరు. తరతరాలుగా తాము గావించిన కృషి, కూడబెట్టిన సంపదలు నీటిపాలయే ప్రమాదం వచ్చింది. ఈ ప్రళయాన్ని నివారించగల శక్తి వున్నా దాన్ని వుపయోగించుకోగలవారు లేకపోయేరు. సరే. గట్లను త్రెంచుకొని మహా గోదావరీ ప్రవాహం దాని యిష్టంవచ్చినట్లుగా తీరస్థ ప్రాంతాలన్నిటినీ ముంచివేసింది. అపారమైన జన, ధన నష్టంవాటిల్లింది. సర్వ సమృద్ధమైన పల్లెలు, పట్టణాలు శ్మశానప్రాయమైపోయినాయి. రాజమండ్రి పట్టణంలో 2/3 భాగం నీటిలో మునిగిపోయింది. 65'6' నీటి మట్టం! చూస్తే యెటువంటివారికీ గుండె తాళదు! ఎటుచూచినా జలమే. ప్రళయమే ఆసన్నమైనట్లుంది. కాని, విపత్తులలో ధైర్యం వహించడం, ఆత్మరక్షణకు, పరస్పర సహకారానికి యత్నించడం మానవ లక్షణం. మానవుని సాంఘిక స్వభావం, ధర్మం వెల్లడి అయేది యిట్టి సంక్షుభిత విపత్తులలోనే గదా. వీలైనంతలో గోదావరీ తీరవాసులు పరస్పర సహకారం గావించుకుంటూ ధైర్యంగా నిలువబడ్డారు. వారంలో మళ్ళా అంతా యథాపూర్వ స్థితికి వచ్చింది. గోదావరీ ప్రవాహం నమ్రతతో, ప్రశాంతంగా సాగిపోతూంటే చూచి, "ఈ నదీమాతయేనా నిన్నమొన్న నంతటి భీకరస్వరూపం దాల్చినది?" అనుకోవలసి వచ్చింది.

ఈ మహా ప్రళయంలో మా యిల్లుకూడ మునిగిపోయింది. విశ్వసాహిత్యమాల గ్రంథాలన్నీ నాశనమై పోతాయని తోచింది. ఇదివరలో ప్రభుత్వం అనేకసార్లు మా గ్రంథాల్ని తీసికొనిపోయి, నాశనం గావించేరు. ఈ సారి గోదావరీ ప్రవాహం మొత్తమంతా యెత్తుకొనిపోయేటట్లు కనబడింది. కాని, మానవయత్నం, కొన్ని పరిమితుల్లోనే కానీయండి,

సఫలం గాకపోదు. మా గ్రంథాలన్నీ అభిరక్షణంలో అమిత ప్రయాసపై, నీటిలోనుంచి వుద్ధరించి, మెట్టకి చేర్చబడినాయి. ఇందులో అనేకమంది మిత్రులు సాయంచేసేరు. నేనూరిలేని సమయంలోనే యిదంతా జరిగింది. ఇవన్నీ గోదావరిలో కలిసిపోతే విశ్వసాహిత్యమాల తన ప్రచురణను మరల కొనసాగించడం అసంభవమై పోయేదే. కాని, నా కృషి యందు శ్రద్ధాభిమానాలున్నవారు అట్లు జరుగనీయలేదు. ఆ మిత్రులకు సర్వదా కృతజ్ఞుడనై యుండుటకన్న, నా సాహిత్యకృషి యితోధికంగా సాగించుటకన్న చేయాల్సినది యింకేమున్నది? ఈ జలపరీక్షలోనుంచి యింత సులభ శిక్షతో వదలిపెట్టి, నా కృషిని సాగించుకోమని అనుమతించిన ప్రాకృతిక శక్తులకు ..... ....

వానరుడు నరుడుగా మారిన ప్రధాన ఘట్టాన్ని గూర్చిన యీ గ్రంథంతోబాటుగా ఏంజిల్స్ మహాశయుని "ప్రకృతి : గతితర్కము" యను వృద్గ్రంథములో మరొక ప్రకరణాన్నికూడ ఆంధ్ర పాఠకుల కందిస్తున్నాము. విజ్ఞాన శాస్త్రీయ విషయాలను గూర్చిన గ్రంథాలనే ప్రధానంగా ప్రచురించదలచి యున్నాము. మానవ మస్తిష్కములలో గూడుకట్టుకుని వున్న అజ్ఞానాంధకారాన్ని పారద్రోలడంలో వైజ్ఞానిక గ్రంథాల పాత్రను గుర్తించి, ప్రాజ్ఞులెల్లరూ విశ్వసాహిత్యమాలకు యితోధిక సహకార మొనర్చెదరని కోరుతున్నాను. సెలవు.

రాజమండ్రి,
30—8—1953.

మహీధర జగన్మోహనరావు,
సంపాదకుడు.

# వానరుడు - నరుడు:
## పరిణామక్రమంలో కర్మపాత్ర

కర్మ లేక శ్రమయే సంపదలకు ఉత్పాదకమని అర్థశాస్త్రజ్ఞుల అభిప్రాయము. ప్రకృతిలోని విషయములను సంపదగా మార్చ్చుటలో శ్రమయే ప్రకృతి తరువాత ప్రాధాన్యత వహిస్తాంది. అంతేగాదు. శ్రమ యింతకంటె అత్యధిక ప్రాముఖ్యత గలదని కూడ చెప్పాలి. మానవుని అస్తిత్వానికే మూలమైనది శ్రమ లేక కర్మ. ఇదెంతవరకూ పోయిందంటే యీ శ్రమలో నుండే నేడు మానవుడు జనించేడని చెప్పాల్సి వుంటుంది.

భూగోళ చరిత్రలో అనేక లక్షల సంవత్సరాలకు పూర్వము, యింకనూ సరిగా నిర్ధరించబడియుండని ఒకానొక యుగంలో, భూగర్భ శాస్త్రజ్ఞులు "టెర్టియరీ పీరియడ్" అని పిలిచే యుగములో,- మానుమంతులు, బహుశః ఆ యుగపు కడపటి భాగములో, మనుష్య-వానరములలో మిక్కిలి యభివృద్ధిజెందిన జాతియొకటి ఉష్ణమండలములో ఒకానొక చోట నివసించు చుండెడిది. ఆ ప్రదేశ మిప్పుడు హిందూమహాసముద్రంలో యెక్కడనో మునిగిపోయి వుంది. మన యీ పూర్వుల వర్ణనను డార్విన్ పండితుడు, సుమారుగా వర్ణించి యున్నాడు. వాని శరీరములనిండా రోమములు, గడ్డములు, సూచియైన కర్ణములు గలిగి, గుంపులుగా చెట్లమీద నివసించేవాళ్ళు.

ఈ తెగ మనుష్య వానరములు వాటి జీవితవిధానమును బట్టియే, బహుశః నేలమీద నడచునప్పుడు చేతుల నుపయోగా

గించు నలవాటును వదలిపెడుతూ, క్రమక్రమంగా నిటారుగా నిలబడుట నలవరుచుకుంటూ వచ్చేను. వీరి జీవితవిధానంలోనే చెట్లనెక్కుటలోకూడ కాళ్లుచేయు పనికంటె చేతులపని విభిన్నమైనదే. మనుష్యవానరము నరుడుగా పరిణామం చెందుటలో యిది ప్రథమ సోపానము.

ఇప్పుడున్న మనుష్యవానరములన్నీ నిటారుగా నిలబడగలవు; కాళ్ళమీదనే నడువగలవు. కాని, అత్యవసరమైనప్పుడు మాత్రమే, అదైనా అవకరంగానే యిట్లు చేయగలవు. కాని, సగం నిలువబడి, చేతులనుకూడ వుపయోగిస్తూనే నడచుట వాటికి సహజమై వుంది. నేలమీద పిడికిళ్ళ ముడుపుల నానుకొని, కాళ్ళను ముడిచి, పొడవైన చేతులలోనుంచి శరీరాన్ని వూపుమీద ముందుకు జరుపుతూ, చంక కర్రలమీద కుంటివానివలె యివి నడుస్తాయి. మొత్తంమీద మన మీనాడు వాలిడికోతుల్లో (తోకలేని మనుష్యవానరములు) నాలుగుకాళ్ల నడకనుంచి రెండుకాళ్ళ మీదనే నడచుటవరకూ గల అంతరావస్థలనూ, పరిణామాలనూ చూడగలము. కాని, వానిలో దేనికీకూడ ద్విపాదగమనం కేవలం అవసరమున కుపయోగించునదే గాని అలవాటు గాదు.

రోమశులైన మన పూర్వులకు నిలబడి నడచుట మొదట నియమంగానూ, తర్వాత అవసరంగానూ యేర్పడుటకు కారణం అప్పటికే చేతులమీద వివిధ కర్తవ్యములు విధింపబడి యుండుటే యని చెప్పాలి. వాలిడికోతుల్లోకూడ అప్పటికే కాలు

చేతులకు వేరువేరు పనివిభాగ మేర్పడేవుంది. వృక్షారోహణ ములో కాలుసేతుల విధులు విభిన్నములుగదా. ఇవన్నీ చేతు లను ముఖ్యంగా ఆహారసేకరణకు, ఆహారగ్రహణమునకు వుప యోగిస్తాయి. కొన్ని క్రిందితరగతి జంతువులలోకూడ మనమీ విషయాన్ని ప్రత్యక్షముగా చూడగలము. చాలరకాల కోతులు చెట్లమీద తాము నివసించుటకు గూండ్లను నిర్మించుటకు చేతుల నుపయోగించును. లేదా చింపంజీనలె కొమ్మలలో కప్పును నిర్మించుకొని, శీతవాతాతపవర్షముల నుంచి రక్షణ నొందుటకు చేతుల నుపయోగించును. మనుష్యవానరములు చేతుల నాత్మరక్షణకుకూడ నుపయోగించును. కర్రలను, కొమ్మ లను బట్టుకొని శత్రువులను కొట్టుటకును, కాయలతోనూ, రాళ్ళతోనూ వారిని ప్రహరించుటకును యివి తమచేతుల నుప యోగించును. బోనులలో నుంచిన కోతులు మానవుల్ని చూచి నేర్చుకొన్న అనేక చిన్నచిన్న పనులను తమ చేతులతో చేయ గలవు. కాని, మానవునికెంతో సన్నిహితమైనదిగా కనిపించున దైనా కోతియొక్క అభివృద్ధిగాంచని చేతికినీ, లక్షల సంవత్స రాల కర్మలచే పరిష్కృతమై అభివృద్ధి నొందిన మానవుని హస్తమునకున్నూ భేదాన్ని సరిగా యిక్కడనే చూడగలము. కోతులయొక్కా, మానవులయొక్కా హస్తాల్లోని యెముకలు నరముల సంఖ్యా, నిర్మాణము ఒకటే; కాని, యెంతటి నికృష్ట స్థితిలోని ఆటవికుడైన మానవుని హస్తమూ కూడా, యెంత అభివృద్ధిగాంచిన వానరహస్తమైనా అనుకరించజాలని పనులను

వందలాదిగా చేయగలుగుతుంది. ఎంత వికారరూపంగల రాతి పనిముట్టునైనా వానరహస్తం యెన్నడూ చేసింది లేదు.

అందుచేత మొట్టమొదట వాలిడి నుంచి మానవు లభివృద్ధి జెందుతూన్న లక్షలాది సంవత్సరాల కాలంలోనూ మన పూర్వులు తమ చేతులతో సామాన్యమైన పనులను, అతి చిన్న చిన్న వాటిని చేస్తూ, అలవరచుకుంటూ, పరిణామం జెందించుకుంటూ వచ్చేరని తేలుతుంది. ఈ పరిణామదశలోని వారికంటె నేటి ఆటవికులు యెంతనికృష్టదశలో వున్నవాళ్లైనా సరే, శారీరకంగా యెంత హైన్యత, పశుతుల్యతకూ దిగనాటిన వాళ్లైనా సరే,- వీళ్లే అత్యున్నతులని చెప్పాలి. మానవ హస్తాలతో మొట్టమొదటి రాయిని పనిముట్టుగా చేయుటకు మున్ను గడచిన కాలం నేటి చారిత్రకయుగంలో పోల్చి చూస్తే చాల దీర్ఘమైనదిగా కన్పించక మానదు. కాని ఆ యుగంలోనే నిశ్చిత మైన ముందడుగు వేయబడినదని చెప్పి తీరాలి. చేతులకు స్వేచ్ఛ గలిగింది. వాటి కంతకంతకు అధిక నేర్పు, లాఘవం కలుగుతూ వచ్చింది. ఈ రీతిగా సంపాదితమైన నేర్పు, లాఘవము వంశపరంపరగా అందించబడుతూ, తరతరానికీ అభివృద్ధి నొందుతూ వచ్చేయి.

ఈ రీతిగా హస్తం కర్మేంద్రియం మాత్రమే గాక కర్మ జన్యమనికూడ చెప్పాలి. కేవలం పనుల మూలంగానే, నిరంతరం నూతన క్రియలకు అనువుపడుటవల్లనే, సంపాదించబడిన కండరాభివృద్ధి సంతానానికి సంక్రమింపజేయబడుతూ వచ్చింది.

చాల తరాలమీద యీరీతిగానే యెముకలనుకూడ అభివృద్ధి చెందించుకొని, సంతానానికి సంక్రమింపజేస్తూ వచ్చేరు. ఈ విధంగా సంపాదితమైన కౌశల్యాన్ని యింకనూ సూక్ష్మమైన క్రియలకూ, క్రొత్తక్రొత్త పనులకూ వినియోగించుటద్వారానే మానవహస్తం అత్యున్నతమైన పరిణామాన్నీ, కౌశల్యాన్నీ పొందింది. రాఫేల్ చిత్తరువులు, థోర్వాల్డ్సేన్ శిల్పములు, పగానినీ గీతభంగిమములు,– యిట్టివన్నీ సాధించగల యింద్ర జాలం మానవహస్తాలకు సంక్రమించినరీతి యిట్టిదే!

ఐతే యిచ్చట గమనించాల్సిన దొకటుంది. హస్తము తనం తటనే, ఒంటరిగా వున్నదిగాదు. పూర్ణము, అత్యున్నతము, సంశ్లిష్టమూనైన సజీవనిర్మాణంలోని ఒక భాగం లేక అవ యవం మాత్రమే మానవహస్తం. అటువంటప్పుడు మానవ హస్తాభివృద్ధి కేది తోడ్పడెనో అయ్యదియే మొత్తం శరీరాని కంతకీ మేలొనగూర్చింది. ఈ యభివృద్ధి రెండు విధాలుగా సాధించబడినది.

డార్విన్ సూచించినట్లు "అభివృద్ధిలో పరస్పర సంబంధ సూత్రం" (Law of correlation of growth) మూలంగా ఒక అవయవంలోని అభివృద్ధి శరీరానికంతకీ ప్రయోజనకరంగా వుంటుంది. స్థూలదృష్టిలో యేలాటిసంబంధమూ లేనట్లు కాన్పిం చుతూన్నా, నిజానికి ప్రతీ అంగియొక్కా వివిధాంగముల స్వరూ పాలు పరస్పర సంబంధానుబంధములు గలిగేవుంటున్నాయి. ఉదాహరణకు చూడండి: ఎర్రని రక్తకణాలు గలిగి (కణాల్లో

న్యూక్లియసులు లేకండా), తల వెనుక భాగం మొదటి వెన్ను పూసను జంట బొడిపెల (Condyles) మూలంగా అతికించబడి యున్న జంతువులన్నీ కూడ బిడ్డలను పాలిచ్చుటకై స్త్రీ ప్రసూతి నాళాన్ని కలిగివుండి తీసుకొస్తున్నాయి; అట్టి స్తన్య జంతువుల్లో చీలిన గిట్టలుగల వాటికన్నిటికీ నెమరు వేయుటకు వీలుగా, ఆహారం కోశంలో అరలు తప్పనిసరిగా వుంటున్నాయి. కొన్ని అంగాల్లో మార్పు తప్పనిసరిగా మరికొన్ని అవయవ రూపాల్లో మార్పును తెచ్చి తీసుతున్నాయి. ఇందుకుగల కారణాల్ని మాత్రం మనం యింకా చెప్పలేకుండా వున్నాము. నీలనేత్రాలు గల తెల్లని పిల్లులు అన్నీ చెవిటివిగానే వుంటున్నాయి! మానవ హస్తం యొక్క క్రమ క్రమ పరిణామం, కౌశల్యం,- యిందు మూలంగా అవసరమైన ద్విపాదత్వం, నిటారుగా నడిచే శక్తి,- వీటికి నిస్సందేహంగా శరీరంలోని యితర అవయవాలమీంద ప్రభావం వుంది. ఏదెట్లావున్నా యీ 'పరస్పర సంబంధసూత్రం' సాధారణ రూపంలోనే ప్రవచించబడిందేగాని దీన్ని గూర్చి పూర్తిగా పరిశోధనలు జరగలేదు.

హస్తాభివృద్ధియొక్క ప్రత్యక్షప్రభావం, దృశ్యమాన ప్రతి ఫలములు మిగిలిన శరీరంమీంద యింకా ప్రాముఖ్యత గలవి. ఇదివరలో చెప్పినట్లు మన వానరపూర్వులు గుంపులుగా నివసించే వారే. జంతువుల్లోకల్లా అతి సామాజిక స్వభావంగలవాడు మానవుడు. ఎంత సామీప్య సంబంధం కనిపిస్తూన్నా యిట్టి వానిని ఒంటరిగా నివసించు పూర్వీకులనుంచి పరిణామం చెందిన

వానినిగా నిరూపించ జూచుట అసంగతమనేది సుస్పష్టమే. కర్మంలో, హస్తాభివృద్ధిలో ప్రారంభమైన ప్రకృతిమీది నరుని విజయయాత్ర, ప్రతీ నూతన అభివృద్ధిలోనూ ఆతని దిఙ్మండలాన్ని, లోకాన్ని విస్తృతపరుస్తూ వచ్చింది. ప్రాకృతిక విషయాలయొక్కా, సూత్రాలయొక్కా నూతన, అజ్ఞాత గుణరీతులను మానవుడు నిరంతరంగా కనుగొంటూ వచ్చేడు. ఇంకొకవైపున కర్మరంగంలోని నూతనాభివృద్ధులు తప్పనిసరిగా సంఘంలోని వ్యక్తులను సన్నిహితులుగా తీసికొనిరావడానికి తోడ్పడుతూ వచ్చేయి. మానవుల్లో పరస్పరసహకార సహాయయాచనరములను, కలిసి పనిచేయవలసిన సందర్భములను హెచ్చించుట ద్వారానూ, యీ సమిష్టి కృషివల్ల సంఘానికేగాక వ్యష్టిగా ప్రతివ్యక్తికీ కూడ గలుగు విశేషలాభములను స్పష్టీకరించుట మూలంగానూ యిది నెరవేరుతూ వచ్చింది. క్లుప్తములో చెప్పాలంటే కర్మకౌశలంలో అభివృద్ధిజెందుతూ వస్తూన్న మానవులు ఒక నిర్దిష్టదశకు వచ్చేటప్పటికి ఒకరొకరితో యేదో యొకటి చెప్పవలసిన అవసరం యేర్పడింది. ఈ అవసరమే, అగత్యమే అందుకు కావాల్సిన అంగాన్ని సృష్టించుకుంది. వాలికీ కోతియొక్క స్వరపేటిక (లారింక్స్) యితఃపూర్వం అభివృద్ధిజెందియుండనిది, యిప్పుడు బహుమెల్లగానే కానిండు, నిస్సందేహంగా మార్పుజెందుతూ వచ్చింది. స్వరనియమనం (ఉదాత్తానుదాత్తస్వరితాలు, ఆరోహణావరోహణాదులు) ద్వారా మార్పుజెందుతూన్న స్వరావయవాలు తిరిగి యింకనూ సూక్ష్మ

మైన స్వరభేదాల నుచ్చరించు శక్తిగలవిగా తయారవుతూం టాయి. క్రమక్రమంగా ముఖమందలి అవయవభాగాలు ఒక్కొక్క స్వరమునే, అక్షరమునే స్పష్టంగా వుచ్చరించుటను నేర్చుకుని, అలవరుచుకున్నాయి.

భాషోత్పత్తియొక్క మూలము, స్వభావమును గురించిన యీ వివరణ ఒక్కటే సరియైనదిగా కనిపిస్తూంది. కర్మలనుంచీ, కర్మక్రమంలో భాష అనేది ఉద్భవించిందనేది జంతువులతో పోల్చి చూచుటవల్ల కూడ నిజమని రుజువవుతూంది.* ఎంత అభివృద్ధిజెందిన జంతువులలోనైనను ఒకటొకటితో చెప్పవలసినవి స్వల్పంగానూ, పరిమితంగానూ వుండి, విస్పష్టమైన భాష అవసరం లేకుండానే చెప్పుకోడానికి సాధ్యమవుతాయి. ప్రాకృతికపరిసరాల్లో యే జంతువూకూడ మానవభాషను మాట్లాడ జాలనందుకుగాని, అర్థంచేసికోజాలనందుకుగాని యిబ్బంది, అసౌకర్యం పొందదు. అదే జంతువు మానవునిచేత పెంపుడిదిగా చేయబడినప్పుడు మాత్రం పరిస్థితి యిందుకు భిన్నంగావుంటుంది. కుక్క, గుర్రము మొదలైనవి మానవులతో నిరంతర సాహచర్యమువల్ల విస్పష్టమైన భాషను అర్థం చేసుకొనే శ్రవణ, గ్రహణశక్తుల్ని అభివృద్ధి చేసుకొని వున్నాయి. అందుచే వాని కందుబాటులోనున్న భావాలను వ్యక్తీకరించే యే భాషనైనా సులభంగా నేర్చుకొని, గ్రహించగల శక్తిగలవిగా యివి వున్నాయి. అంతేగాక యీజంతువులు తమ కంతవరకూ అసను

* విశ్వసాహిత్యమాల ప్రచురించిన "విజ్ఞాని పావ్లోవ్" అను గ్రంథంలో పావ్లోవ్ పందీతుడు- వరవానరాలమీద గావించిన పరిశోధనలనుగూర్చి చదవండి (వం.)

భూతములైన నూతనభావాల్ని,— మానవునియందు ప్రేమాభిమానాలు, విశ్వాసము మొదలైనవానిని సంపాదించుకొనే శక్తి గలవిగా కూడ తయారైనాయి. ఈ జంతువులతో సాహచర్య పరిచయమున్న యెవరైనను యిప్పుడీ జంతువులు మాట్లాడలేని లోపమును తప్పనిసరిగా గుర్తించి తీసుతారు. కాని, దురదృష్ట వశాత్తూ యీ జంతువుల స్వరావయవము లొక నిర్దిష్టదిశలో అత్యంతమైన ప్రత్యేకాభివృద్ధిని పొందివుండడంచేత నవి యిప్పుడు మార్పుచెందుట కవకాశ మెంతమాత్రమును లేదు. ఐననూ అసలు యీనోరంటూ వున్నచోట్లలో కొన్ని హద్దుల్లోనే అయిననూ యీలోపము కప్పివేయ నవకాశం వుంది. పక్షుల దౌడలు మొదలైన వాగింద్రియాలు మానవుల వాటికంటె యెంతో విభిన్నములుగా వున్ననూ మాట్లాడ నేర్వగల ప్రాణులొక్క— పక్షులుమాత్రమే. పక్షులలోకల్లా కఠోరస్వరం గల చిలుకయే అన్నిటికంటేనూ బాగుగా మాట్లాడ గలదు. చిలుకకు తాను మాట్లాడుదాని యర్థము తెలియుదంటె ఎవరూ వ్యతిరేకించ నవసరములేదు. కేవలమూ మాట్లాడుటలోని ఆనందంకోసమూ, మనుష్యులతో కలిసియుండుట కోసమూ చిలుకలు గంటల తరబడి అదేపనిగా వాగుతూ, తమకువచ్చిన వాగ్జాలాన్నంతనీ పునశ్చరణ చేస్తూంటాయి. అంతేగాక దాని గ్రహణశక్తికి లోనై యున్నంతలో చిలుక తాను మాట్లాడు దాని భావాన్ని గ్రహించగలదు. అది గ్రహించగలుగుటకు వీలుగా, దానికా మాటలు అర్థద్యోతక మగునట్లు గనుక తిట్లు,

దూషణవాక్యాలు నేర్పితే వాటినది తిరిగి తన్ను బాధించి వేధించేవాళ్ళమీద ప్రయోగిస్తుంది. (ఉష్ణదేశాలనుంచి తిరిగివచ్చే నావికులకు యిదొక కాలక్షేపం.) బెర్లిన్‌లోని సంస్థ నమ్ము వాళ్లకిన లెనే యివికూడా సరిగ్గా శాపనార్థాలను, తిట్లను ప్రయోగించగలవు! అల్లే పంస్థూ పప్పాలూ కొంకు యాచించుటలో కూడ వీటి గ్రహణశక్తి బాగుగా పనిచేయుగలదు.

ప్రప్రథమంలో కర్మ, దానితోనూ, దాని తర్వాతనూ వాక్కు,- యీరెంపు ప్రోద్బల కారణముల ప్రభావంక్రిందనే ప్రధానంగా వాలిడియొక్క మెదడు మానవుని మేధస్సుగా పరిణామం చెందింది. ఈ రెంటికీ స్థూలదృష్ట్యాచూస్తే యెంతదగ్గర పోలికలున్నప్పటికీ మానవుని మెదడు అత్యున్నత పరిణామాన్నీ, పరిమాణాన్నీ వ్యక్తీకరిస్తూంది. మేధస్సుయొక్క అభివృద్ధితో బాటు దానికి సన్నిహితావయవములైన జ్ఞానేంద్రియాలుకూడ (త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు) సమానాభివృద్ధిని పొందుతూ వచ్చేయి. వాగింద్రియాభివృద్ధితో బాటుగానే తదనుగుణ్యమైన శ్రవణేంద్రియాభివృద్ధి పరిణామములు తప్పనిసరిగా వచ్చినట్లే, మేధస్సు అభివృద్ధిజెందడంతో జ్ఞానేంద్రియాలూ, వాటిశక్తులూ సునిశితములైనాయి. ఉదాహరణకి: గ్రద్ద మానవునికంటె చాలదూరానికి చూడగలదు; కాని గ్రద్దకన్నుకంటె మానవనేత్రము వస్తువులలో సూక్ష్మవివరాలను చూడగలదు; మానవుని ఘ్రాణేంద్రియముకంటె కుక్కది అధికతీక్ష్ణమైనదే గాని మానవుడు గ్రహించగల వాసనాభేదములలో నూరో

వంతుకూడ కుక్కకి తెలియవు. వివిధవాసనలు వేర్వేరు పదార్థాలకు సంకేతములుగా గుర్తించగల శక్తి మానవునికంటె కుక్కలో కొంవడివుంది. వానరములలో స్పర్శాజ్ఞానం యేమాత్రము అభివృద్ధిజెందలేదు; మానవునిహస్తం కర్మకారకమవుతూ అభివృద్ధి జెందడంతో బాటు పరిణతిజెంది, స్పర్శాజ్ఞానాన్ని కూడా వృద్ధిబొందించుకుంది.

మేధస్సు, తత్సంబంధములేనైన జ్ఞానేంద్రియములూ,- వీని ప్రభావం తిరిగి కర్మకౌశలం, వాక్కుమీద పడనేపడుతుంది. విషయజన్యజ్ఞానంలో, భావంలో అంతకంతకు అభివృద్ధిగాంచుచున్న విస్పష్టత, విషయమునుంచి విషయజన్యజ్ఞానాన్ని (భావాన్ని) వేరుచేసుకొనగల భావనాశక్తి, కర్తవ్యతాజ్ఞానమూ వృద్ధిజెందుతూ, కర్మకూ, వాక్కుకూ శీఘ్రపరిణతి కలిగాయి. చివరకి మానవుడు వానరుడినుంచి భిన్నుడుగా విస్పష్టంగా వేరుబడినప్పుడు కూడా యీ అభివృద్ధి నిలిచిపోలేదు; పైపెచ్చు యింకా శీఘ్రంగా, తీవ్రంగా పరిణతమవుతూ వచ్చింది. ఈ యభివృద్ధి వివిధస్థలాల్లోనూ (జాతుల్లో), వేర్వేరుకాలాల్లోనూ విభిన్నంగావుంటూవుంది. అంతేగాక యీయభివృద్ధి స్థానికంగానో, తాత్కాలికంగానో (దిక్కాలావచ్ఛిన్నంగా) స్థంభించడం, తిరోగమించడం కూడ వుంటుంది. ఐనా మొత్తంమీదమాత్రం యీ అభివృద్ధి పురోగమనశీలమైనదేనని చెప్పాలి. ఇట్టి పురోగతి ఒకప్రక్క తీవ్రంగా ముందుకు సాగడం, రెండో ప్రక్క నిర్దిష్టదిశలో

నడవడం,— యీ రెండుకార్యములూ కూడ సంపూర్ణమానవుని అవతరణతో బాటు వెలసిన సంఘంవల్ల జరుగుతూ వచ్చేయి.

మానవుని ఆయుర్దాయంలో ఒక క్షణమువలెనే, మన భూమి వయస్సులో* లక్షలసంవత్సరాలు అత్యల్పతమ భాగమే నని చెప్పాలి. శాఖాచరములైన వానరమూకలనుంచి భూమిం చరులైన మానవసంఘం ఉదయించేటందుకు కొన్నిలక్షల సంవ త్సరాలు గడిచి వుంటుందనేది నిస్సంశయము. ఎట్లో చిట్టచివ రకి మానవసంఘం పుద్భవించింది. ఐతే వానరమూకలకూ మానవసంఘాలకూ గల ప్రధాన భేదం యెందులో వుంది? కర్మ లోనే! (పని, కృషి, శ్రమచేయుట లేక క్రియాకారకత్వం అన కూడ చెప్పవచ్చును. అనువాదకుడు) భౌగోళిక పరిస్థితులు విధించే నియమాలవల్లనో, యిరుగు పొరుగున నివసించే ఇతర గుంపుల ఒత్తిడివల్లనో ప్రతి వానరసమూహమూ తమకు నిర్ది ష్టమై వున్న ప్రాంతంలోనే తింటూ, త్రాగుతూ, తిరుగుతూ వుండిపోవడంతో తృప్తిజెందుతూంది. క్రొత్తప్రదేశాల్నీ, మేత పట్టుల్నీ సంపాదించడానికి యివి వలసపోవడం, యుద్ధాలు చేయు డం జరుగుతూన్నా యివి ఆ యా ప్రదేశాలు ప్రాకృతికంగానే యొసగగల కందమూలఫలాదులతోనే సంతృప్తిజెంది వుంటు న్నాయి. ప్రకృతిమాతనుంచి యితోధిక ఫలాన్ని ఒడిసిపుచ్చు

---

* ఈ విషయంమీద ప్రామాణిక పండితుడైన సర్ విలియం థాంప్సన్ గణనప్రకారంగా యీ భూమ్యోపరితలం జీవోత్పత్తి వికాసాలకి తగినట్లుగా చల్ల బడి యిప్పటికి పదికోట్ల వత్సరాలై నది. (ఏంజిల్సు నోటు.)

కొనే కృషి, ప్రయత్నం యీ వానరమూకలు గావించలేవు. భూమిని అధికసారవంతంగా చేయు మూత్రపురీషాదుల యెరువు వేయుటయైననూ యివి యాదృచ్ఛికంగానే తప్ప ఐచ్ఛికంగా చేయజాలవు. అవకాశమున్న మేతపట్టులన్నీ ఆక్రమించబడి పోయిన తర్వాత వానర జనసంఖ్యలో పెరుగుదల యింక సాధ్యంగాదు. వాటిసంఖ్య వున్నచోటనే వుండిపోగలిగితేనే మహాగొప్ప! కాని, సాధారణంగా అన్ని జంతువులూ ఆహార పదార్థాల నపరిమితంగా వృథాగావిస్తాయి. అంతేగాక బీజాల్ని కూడా విశేషంగా నాశనంగావించి, మళ్ళీతరం మొక్కలు లేవ కుండా చేస్తాయి. తరువాత పిల్లలను పెరుగుతుందనే ఆలోచనైనా లేకండా ఆడలేడిని కూడా గోడేలు చంపి తినేస్తుంది; వేటగా డట్లు గావించడు. గ్రీసుదేశంలోని మేకలు మొక్కల్నీ, పొదల్నీ తినేసి, చిగుళ్లు పొటమరించకుండా చేసి, బోడిగుట్టలు, కొండ దిబ్బలూ మిగిల్చాయి; అందువల్లనే గ్రీసులోని పర్వతాల్లో పచ్చని తోక్కటీ లేదు. జంతువులలోని యీ వినాశకర ఆర్థిక విధానం వేర్వేరు జంతుజాతుల క్రమపరిణామంలో ముఖ్య పాత్ర ధరిస్తూంది. ఆ యా జంతువులు తమకు ముఖ్యాహారంగా వున్నదాన్ని యీ "వినాశకర విధానం"వల్ల నోల్పోయి, మరొక ఆహారానికి అలువడవలసి వస్తూంది. ఇందువల్ల రక్తంలోనికి నూతనరాసాయనిక పదార్థాలు ప్రవేశించి, వాటి శరీరతత్వం, క్రమంగా మారిపోతూంటుంది; యిట్టి మార్పుల కలువడజాల నంతగా స్థిరీకృతములైన జంతుజాతులు నాశనమైపోవక తీరదు.

జంతువులలోని యీ వినాశకర ఆర్థిక (ఆహార) విధానమే వానరములు నరులుగా పరిణామమందెందుట కత్యంత ప్రోద్బలకారి యైన దనుటలో సందేహము లేదు. తెలివితేటలు, పరిసరాల కలువడుశక్తి,– వీటిలో మిగిలిన అన్నిటినీ మించిన ఒకజాతి వానరములు యీ వినాశకర ఆహారవిధానంవల్ల అంతకంత కధికసంఖ్యాకములైన మొక్కలను తమ తిండికై వుపయోగించుట, ఆ మొక్కల పోషకభాగములలో తినదగిన రుచిసంతతును లైన వాటి నెక్కువగా కనిపెట్టి వాడుట తప్పనిసరిగా తటస్థించింది. క్లుప్తంలో చెప్పాలంటే, వాటి యాహారం అంతకంతకు విభిన్నత్వం గలదగుచుండుట, తద్వారా వాటి రక్తంలోనికి ప్రవేశించు రసాయనికపదార్థాలుకూడా వైవిధ్యం గలవగుట,– యివే మానవులుగా మారేందుకు గావాల్సిన రాసాయనిక పునాదిని నిర్మించినాయి. కాని, దీన్నంతనూ 'కర్మ' 'కృషి' యని చెప్ప వీలులేదు. సరియైన అర్థంలో 'కర్మ' అనేది 'పరికరాలు' లేక 'సాధనాలు' నిర్మించుటతో ప్రారంభమవుతుంది. ఇప్పటివరకు మానవుడు కనుగొన్న వాట్లలో అత్యంతప్రాచీనములైన పరికరాలేవి? చరిత్రకు పూర్వముండిన మానవావశేషాలలో కనుగొనబడిన వస్తువులవల్లనూ, చరిత్రకందిన ప్రాచీన జనుల జీవిత విధానాలవల్లనూ, నేటి యాటవికులలో అత్యంత ప్రాథమిక దశలో వున్న జాతుల జీవితవిధాన పరిశీలనవల్లనూ తేలిన దేమిటంటే, వేటకు– చేపలు పట్టుటకూ వుపయోగించే సాధనాలే అత్యంత ప్రాచీనములైన వని. వేట కుపయోగించు

నవే ఆత్మరక్షణకు కూడ పనికివస్తాయి. కానైతే, వేట, చేపలు పట్టుట యెప్పు డవసరమవుతాయి? కేవల శాకాహారంనుంచి మాంసాన్ని కూడ ఆహారంగా వుపయోగించగల అవకాశం, మార్పు సంభవించినప్పుడేగదా. వానరులు నరులుగా పరిణామం పొందడంలో ఆహారంలోని యీ మార్పుకూడా ఒక మెట్టే. ప్రాణుల శరీరంలో "మెటబాలిజం" అనే రసాయనిక క్రియ నిరంతరం జరుగుతూంటుంది. (తినే ఆహారం జీర్ణమై రక్తంగానూ, మాంసం, కండరాలు, యెముకలు, మజ్జ మొదలైనవిగానూ మారు ప్రక్రియావిశేషం. 'తిండి వంటబట్టుట' అని చెప్పచ్చు. అనువాదకుడు.) ఈ మెటబాలిజంకు అవసరమైన పదార్థాలను సంపూర్ణ సక్యస్థితిలో మాంసాన్నుంచే మానవ శరీరం తీసుకోగలుగుతుంది. ఇందుమూలంగా జీర్ణక్రియకు అవసరమైన కాలం హ్రస్వ మొనర్పబడుటేగాక, యితర క్రియా కలాపాలకు అనగా వృక్షములలోవలెనే మానవశరీరాల్లోకూడ పైకి తెలియబడకుండా తమంతటనే జరిగిపోవు అభివృద్ధిపరిణామములకవసరమైన కాలంకూడ కలిసివస్తూంది. ఈ విధంగా వలయు కాలము, సామగ్రి, యిచ్చా సమకూర్చుకొని మానవుడు నిజమైన జంతుజీవితవిధానమును, దాని నిజమైనఅర్థంలో విస్ఫుటంగా గడుప నారంభించేడు. అభివృద్ధిగాంచుచున్న మానవుడు వృక్షముల కెంతదూరం పోగలుగుతూన్నాడో జంతువులకంటె కూడ అంత వున్నత శిఖరానికి పోతూన్నాడు. మాంసాహారంతో బాటు శాకాహారానికి అలవాటుబడుటవల్ల పిల్లులు,

కుక్కలు యేరీతిగా మానవునికి అనుచరములుగా మారినవో, అట్లే శాకాహారముతో పాటుగా నేమైననూ అభివృద్ధి చెందు తున్న మానవునికి మాంసాహారము స్వేచ్ఛను, శారీరకపుష్టిని యొసగినది. అంతేగాదు. మాంసాహారము ప్రధానంగా మానవుని మేధస్సుమీద అమేయప్రభావాన్ని గలిగివుంది. ఇప్పుడు మానవ మేధస్సు తన పోషణాభివృద్ధులకు గావాల్సిన పదార్థము లను యితఃపూర్వంకంటె అత్యధికంగా పొందగలిగింది; మానవ మేధస్సు వెనకటికంటె శీఘ్రంగా అభివృద్ధిజెందుతూ, నిశిత మగుచూ, తరతరానికీ సూక్ష్మతరమవుతూ వచ్చింది. శాకా హారులపట్ల పరిపూర్ణ గౌరవభావంతోనే ఒక విషయమున్న చెప్ప గలము. మాంసాహారము లేకండా మానవుడు నిర్మించబడి, అభివృద్ధినొంది యుండలేడు. మనకు తెలిసినంతవరకు అన్ని తెగ ల్లోనూ, జాతుల్లోనూ మాంసాహారము యేదోయొక కాలం లోనే అయినప్పటికీ మానవభక్షణకి దారితీసిందంటే (ఇంగ్లీషు నివాసుల పూర్వులు,- వెలిటూబియనులు, విర్జియనులు,- తమ తల్లిదండ్రులను యిటీవలి వరకూ అంటే పదోశతాబ్దివరకూ కూడ భక్షిస్తూండేవాళ్లు.) మన మీరోజున దానినంతగా గణ నకు తీసికోనక్కరలేదు.

మాంసాహారము రెండు ప్రధానమైన మార్పులకు, అభి వృద్ధులకు దోహదమిచ్చింది: అగ్నిని ఆయుత్తమొనర్చి, సజ్జిత మొనర్చడానికీ, జంతువులను మచ్చిక చేయడానికీ. అగ్నివిద్య, జీర్ణక్రియను యింకా సూక్ష్మీకరించింది; అదెట్లంటే నోట

బెట్టుకొనుట కష్టటికే సగం జీర్ణమైన (పచనమైన) ఆహారాన్ని సమకూర్చడం ద్వారా. జంతువులను మచ్చికచేయుటవల్ల మాంసాహారం పుష్కలంగానూ, నిరంతరాయంగానూ లభించడం సాధ్యమైంది. వేటమాంసానికి తోడుగానూ, వేట నిష్ఫలమైనప్పుడూ, యిందుమూలంగా మాంసం లభించుతూండడమే గాక, పాలు, తజ్జన్యములైన పెరుగు, వెన్న కూడ సమకూడినవి. ఈ నూతనాహారపదార్థం, క్షీరం,— మాంసమంతటి విలువగలదీను. ఈ రీతిగా అగ్నివిద్య, పశుపాలన అను నీ రెండు నూతన కృషులూ మానవునికి నూతనవిమోచనసాధనములుగా అయినాయి. మానవునియొక్కా, సంఘముయొక్కా అభివృద్ధిలో యీ రెండూ ప్రత్యక్షంగా ప్రధానపాత్ర వహించినాయి; పోతే వీటి అప్రత్యక్ష ప్రభావాన్నీ, ఫలితాల్నీ గూర్చి వివరాల్లోకి గనకపోతే మనం ప్రస్తుతాంశానికి చాలదూరం పోతాము.

రుచిగలిగి, తినదగిన వాటి నన్నిటినీ తినుట నేర్చుకున్నట్లే, మానవుడు యే వాతావరణములోనైనను నివసించుటను కూడ నేర్చుకొన్నాడు. భూమిమీద నివాసార్హమైన ప్రదేశాలన్నిటనూ అతడు వ్యాపించేడు. తనంతట తానే యిట్లు చేయగలిగిన ప్రాణి మానవు డొక్కడే. వాతావరణ పరిస్థితుల కన్నిటికీ అలవడిన యితరప్రాణులన్నీ, అనగా పెంపుడుజంతువులు, కొన్ని కీటకాదులు,—యివి తమంతట తాముగాక మానవుని వెనువెంటనే, అతనితో బాటుగా వచ్చి వ్యాపించినవే. సంవత్సరం పొడుగునా వేడిమిగల వాతావరణం నుంచి శీతలప్రాంతాలకు

మానవుడు మారినపుడు అతనికి నూతనావసరాలు యేర్పడి నాయి. అక్కడ వేసవి, వర్ష కాలం, శీతకాలం అనే ఋతుభేదం వుండినందున మానవునికి నూతనావసరాలు యేర్పడినాయి. శీతలాన్నుంచి శరీరాన్ని రక్షించుకొనేందుకు యిళ్లు, బట్టలు అవసరమైనాయి. నూతన క్రియాక్షేత్రములు, నూతన కర్మ రూపములు విస్పష్టములై మానవుణ్ణి జంతుకోటినుంచి మరిం తగా దూరం గావించినాయి.

ఒకేవొక వ్యక్తియొక్క హస్తము మొదలైన కర్మేంద్రి యాలు, వాగింద్రియాలు, మేధస్సు,- వీటి సహకారంవల్ల చాల పనులు సుకరములైనాయి. అట్లే సంఘమంతటిలోనూ వ్యక్తులయొక్క పరస్పరసహకారంవల్ల మానవులు అంతకంతకు అతిక్లిష్టతరములైన కార్యములను చేయగలుగుటయేగాక ఉన్న తోన్నత లక్ష్యముల నేర్పరచుకుంటూ, వాటిని సాధిస్తూ వచ్చేను. ప్రతితరానికీ కర్మరూపాలు మారిపోతూ వచ్చినాయి. కర్మ అంతకంతకు సుశిక్షితమూ, వైవిధ్యముగలదీ యగుతూ వచ్చింది. వేట, పశుపాలనము, వీటికి వ్యవసాయం చేర్చ బడింది; తరువాత వడకుట, నేత, లోహవిద్య, కుండలు చేయుట, పడవలు నిర్మించుట,- యివన్నీ అవతరించినాయి. వర్తకవ్యాపారములు, పరిశ్రమలుతోబాటు చిట్టచివరకి కళలు, విజ్ఞానశాస్త్రములు వర్ధిల్లినాయి. తెగలనుంచి జాతులూ, ప్రభు త్వములూ యేర్పడినాయి. ధర్మశాస్త్రాలు, రాజకీయాలు బైలుదేరినాయి; వీటితోబాటు, మానవమేధస్సులో మానవ

సంబంధివిషయముల అత్యద్భుతప్రతిబింబమైన 'మతం' కూడా నిరూపితమైంది. ఈ నూతనసృష్టు లన్నిటిముందూ చేతితో చేసే ప్రత్యక్ష నిర్మాణములన్నీ మరుగున పడిపోయేయి. ఈ నూతన సృష్టులన్నీ కేవలం మానవమేధో జన్యములుగానే, సమాజాన్నంతనూ తమ అమేయప్రభావంక్రింద వుంచుకొనేవిగానే తోచినాయి. ఎంచేతనంటే అంతకు పూర్వమే సమాజం యొక్క అతిప్రాథమికదశలోనే, వుదాహరణకు - ఆదిమ సమాజంలోనే మానవమేధస్సు నిర్దిష్టమైన ఒక పద్ధతి, ప్లాను ప్రకారం కర్మకలాపాలను నడిపించేది; అంతేగాదు - తన అభిప్రాయానుసారంగా యితరుల చేతులలోనే పనులను పూర్తి చేయించగలిగి వుండేది. అందుచేత మానవనాగరికతాభివృద్ధికీ, శీఘ్రపురోగమనానికీ ప్రధానకారణం మేధస్సేననీ, మేధస్సు యొక్క శీఘ్రాభివృద్ధీ, చురుకుదనమూ మీదనే మిగతా అన్నిటి అభివృద్ధీ ఆధారపడియున్నదనీ భావించ నారంభించేరు. మానవులు తమ చర్యలన్నీ అవసరప్రేరితములుగా గాక మేధోప్రేరితములుగానే గుర్తించుట, మాట్లాడుట ప్రారంభించేరు. యదార్థానికి మన అవయవములు కూడ మేధస్సులో ప్రతిబింబించి, భావములుగా రూపింపబడవలసినవే ననుకోండి. ఈ రీతిగా కాలం గడుచుచున్నకొలదీ క్రమక్రమంగా యీ ప్రపంచంయొక్క భావనారూపమే, ప్రతిబింబమే మానవుల మేధస్సులో స్పందించ నారంభించింది. పురాతనప్రపంచం, ఆదిమసమాజం ఆఖరైనప్పటినుంచీ మరీ యీ భావవాదము

లేక భావమే ప్రధానమనే సిద్ధాంతం మానవుని స్తిష్కాల్లో గాఢముద్రను వహిస్తూ వచ్చింది. ఇప్పటివరకూ యింకనూ యీ భావవాదమే మానవుల్లో గాఢాతిగాఢంగా వ్యాపించి వుంది. డార్విన్ సిద్ధాంతానుయాయులైన ప్రకృతిశాస్త్రజ్ఞులు, జీవశాస్త్రజ్ఞులుకూడా మానవుని పుట్టుకను గూర్చి విస్పష్టమైన భావాల్ని యేర్పరచుకోలేకుండా వున్నారంటే యీ భావవాద మెంతటి ప్రభావం గలిగివుందో మనం గ్రహించవచ్చును. ఎట్లంటే, యీ ప్రకృతిశాస్త్రవేత్తలు భావవాద ప్రభావానికి లోనైయే, మానవ పరిణామంలో "కర్మ"యొక్క పాత్రను గుర్తించలేకుండావున్నారు.

జంతువులుకూడా తమ పనులవల్ల బాహ్యప్రకృతిని మార్చ కలుగుతూన్నాయని యిదివరలోనే సూచించి యున్నాము. కాని, మానవులు ప్రకృతిని మార్చగలిగినంతగా అవి మార్చ లేవు. జంతువులు తమ పరిసరాల్లో తీసికొనివచ్చు మార్పులు కూడ, తమ మట్టుకు తామూ అందుకు ప్రతిక్రియలను గావిం చుతూ, మార్పులకు కారణమైన వాటినే తిరిగి మారుస్తు న్నాయి. ప్రకృతిలో యే విషయమూ, సంఘటనా ఒంటరిగా, ఏకాకిగా వుండదు. ఇవన్నీ ఒకే 'పూర్ణం'లోని భాగాలుగా వుంటున్నాయి; ఒకటి అన్నిటినీ మారుస్తూంది; తిరిగి అన్నీ కలిసి ఆ ఒక్కదాన్ని మారుస్తున్నాయి. సర్వతోముఖమూ, సర్వగతమూ నైన యీ క్రియా ప్రతిక్రియలూ, పరిణామమూ

నూతనజాలకపోవడంవల్లా, మోసుకుటవల్లా మన ప్రకృతిశాస్త్ర వేత్తలు అతిసామాన్యవిషయాలనూ, సంఘటనలనూ గూడ స్పష్టంగా నూతనజాలకున్నారు. గ్రీసుకొండలమీద అడవులు పెరుగకుండా మేకలెల్లు వినాశం గావించినది మనం గమనించి యున్నాము. అట్లే సెయింట్ హెలీనా ద్వీపంమీదకు మొట్ట మొదట వలస వచ్చినవారు తెచ్చిన మేకలు, పందులు, అక్క డుండిన మొక్కలన్నిటినీ తిని నిర్మూలించుటద్వారా, ఆ తర్వాత వారు తెచ్చిన నూతనజాతుల మొక్కల వ్యాపకానికి అవకా శాన్ని, పరిస్థితుల్ని కల్పించినాయి. కాని జంతువులు తమ పరి సరాలలో శాశ్వతమైన మార్పుల్ని తేగలిగినవంటే అది కేవలం యాదృచ్ఛికంగానే! ఆ జంతువుకు సంబంధించినంతవరకు అది అనాచ్ఛికంగానే జరుగుతూందని చెప్పాలి. మానవులు జంతు వులనుంచి యెంతగా విభిన్నులూ, దూరులూ అవుతున్నారో అంత హెచ్చుగా వారి చర్యలు చైతన్యయుతంగానూ, నిర్దిష్ట ఫలాపేక్షతో గావించు నిర్మాణాత్మకకృషిగానూ నిరూపితము లవుతాయి. తామేమి గావించుచున్నదీ తెలుసుకోనకయే జంతువులు తమ పరిసరాల్లోని వృద్భిజ్జజాతుల్ని నాశనం గావి స్తాయి; యిక మానవుడో? కొన్ని మొక్కలను నిర్మూలించుట ద్వారా విముక్తం గావించిన భూమిలో తనకు కావలసిన పంటలు పండిస్తూ, ఫలవృక్షాలనూ తోటలనూ నాటుతూ, స్వోపయోగానికి దెచ్చుకున్నాడు. ఆ మొక్కలు, వృక్షాలు మానవునికి అనేక రెట్లుగా ఫలితాల్ని యివ్వనారంభించినాయి.

ఉపయోగకరమైన మొక్కలను, జంతువులను ఒక దేశాన్నుంచి మరో దేశంలోనికి ప్రవేశపెట్టి, మానవుడు ఖండాల నైసర్గిక సంపదనే మార్చివేసేడు; అంతేగాదు; మానవుని పోషణలోబడి, కృత్రిమపద్ధతులవల్ల జంతువులుగా, మొక్కలుగా గుర్తింపజాలనంతగా నూతనరూపాల్ని పొందుతూన్నాయి. మన అనుదినాహారములైన కాయధాన్యాలు ఏ ప్రాథమిక అరణ్యజాతుల నుంచి వర్ధిల్లినవో గనుగొనుటకు గావించుతూన్న యత్నాలు నేటికీ ఫలప్రదములు గాలేదు.* కుక్కలు, గుర్రములు యివన్నీ జాతులవిగా వున్నాయి; యివన్నీ యే ప్రాథమిక జంతుజాతుల నుంచి ప్రాదుర్భవించి, పరిణామమొందినవో అనునది యింకనూ వివాదాస్పదముగనే యున్నది.♦

ఏ దెట్లున్నను ప్రాణులన్నీ కూడా నిర్దిష్టసూత్రములద్వారా, ముందు ఆలోచించుకొన్న రీతులలో పనిచేయగలవనే యదార్థాన్ని మాత్రం మనం కాదనజాలము. అంతేగాదు. ఎక్కడెక్కడ "ప్రోటోప్లాజం" -సజీవమగు ఆల్బుమిన్ అను శ్వేత శ్లేష్మధాతువు,- వుంటూందో, స్పందిస్తూందో (అనగా బాహ్య

---

* 1898 నాటివరకూ యీ ప్రయత్నాలు ఫలప్రదములు కాలేదు. కాని నేడు సోవియటు శాస్త్రజ్ఞులు గావించిన పరిశోధనల ఫలితంగా వీనికి మూలములైన మొక్కలజాతులు ఆఫ్ఘనిస్థానంలోని దుర్గమ పర్వతప్రాంతాల్లో కనుగొనబడినాయి. ఈ కథంతా "విశ్వామిత్ర సృష్టి" అనే మా గ్రంథంలో వివరంగా యిచ్చియున్నాము. —అనువాదకుడు.

♦ ఈ వివరాలన్నీ శాస్త్రజ్ఞులు సంతరించియున్నారు. "మన వంశవృక్షం" అను మా ప్రచురణలో యీ కథనంతనూ చదవండి. —అనువాదకుడు.

ప్రేరణలకు ప్రతిక్రియలను గావిస్తాంధో) అక్కడక్కడల్లా నిర్దిష్టసూత్రబద్ధంగా పనిచేయుటను అతిప్రాథమికదశ, రూపంలో నైనను చూడగలం. ఇటువంటి ప్రతిక్రియలు జరుగుటకు నర ముల సెల్లులే (కూటములు) వుండనక్కరలేదు; అసలు యిట్టి సెల్లులు లేనిచోటకూడ యిట్టి ప్రతిక్రియలు జరుగుతాయి. కీటకభక్షకములైన మొక్కలున్నాయి,- అవి తమ ఆహారాన్ని పట్టుకొనే విధానాన్ని చూస్తే పూర్తిగా జ్ఞానుగల కృత్యంగానే కనిపిస్తుంది; ఈ క్రియాకలాపం అనైచ్ఛికంగా నిర్వర్తిత మగు చున్న దేయైనను, ప్రాణులలో నాడీమండలాభివృద్ధి కనుగుణం గానే చైతన్యయుతములూ, నిర్దిష్టములూనైన చర్యలను తగు శక్తియుక్తులు క్రమాభివృద్ధి నొందుతూంటాయి. జంతువులన్ని టిలోకీ పైమెట్టుమీద నున్నవి సస్తనములు (పిల్లలకు పాలిచ్చి పెంచు జంతుజాతులు); వీటిలోనే యిట్టి జ్ఞానం, చైతన్యం పరాకాష్ఠ నొందుతూంది. ఉదాహరణకి యింగ్లాండులో నక్క లనే చూడండి. ఇవి తమకుగల స్థలపరిచయ జ్ఞానాన్ని యెంత నిర్దిష్టంగా, గురితప్పకండా వుపయోగించుకుంటూ, వేటాడు వాళ్ళని తికమకలు బెట్టునో; యెంత తెలివిగా ప్రాంతమందలి అనుకూల పరిస్థితుల నన్నిటినీ స్వీయరక్షణకై, పని దొరకనీ కండా చేయడానికై వుపయోగించు కుంటాయో,- నక్కల వేటతో పరిచయమున్న వారందరికీ తెలిసినదే. మానవునితో నిత్యసాహచర్యంవల్ల యింకనూ అభివృద్ధినొందిన పెంపుడు జంతువుల్లో అనేకటక్కరులు, జిత్తులు మనం చూస్తూంటాము.

వాటి ప్రవర్తన పిల్లల ప్రవర్తనను తలపిస్తుంది. ఎందుకంటే మానవపిండముయొక్క అభివృద్ధి చరిత్ర, కోట్లకొలది సంవత్సరాల జీవపరిణామ చరిత్రయొక్క సంక్షిప్తీకరణమే; క్రిములనుంచి సస్తనజంతువులవరకూ గల సుదీర్ఘ జంతుపరిణామక్రమమే మాతృగర్భంలోని మానవపిండపరిణామంలో చర్విత చర్వణంగా, క్లుప్తంగా చూడగలము. అట్లే మానవశిశువు యొక్క మేధోభివృద్ధి క్రమంకూడా మరింత సంక్షిప్తంగా పునశ్చర్వితమైన, జంతుజాతులన్నిటియొక్కా గాని కనీసం కడపటి తరాల జంతుజాతులయొక్క గాని యుగయుగాల మేధోపరిణామక్రమ చరిత్రయేనని చెప్పాలి. అంతవరకు నివసించిన జంతువు లన్నిటియొక్కయు, చర్యలన్నిటియొక్కయు మొత్తం కూడా యెన్నడూ తమ ప్రభావాన్ని యీ పృథ్వీమీద శాశ్వత ముద్ర వేయడానికి యత్నించింది లేదు. ఈ పనికై మానవుడే రావాల్సి వచ్చింది.

క్లుప్తంగా చెప్పాలంటే జంతుకోటి బాహ్యప్రకృతిని కేవలం వుపయోగించుకుంటుంది; దానిలో మార్పులను కేవలం తన వునికిచేతనే రూపిస్తుంది; అట్లుగాక మానవుడు తను గావించు మార్పులవల్ల నీ ప్రకృతియే తన కోర్కెల నిచ్చేటట్లు చేస్తున్నాడు,— అంటే ప్రకృతిని శాసిస్తున్నాడు. ఇతర జంతువులకూ మానవులకీ గల కడపటి తేడా, ప్రధానభేదం యిదే. ఈ భేదాన్ని కల్పిస్తూన్నది కూడ 'కర్మ' యే, కర్మకారిత్వమే.

ఏదేశమైననూ మానవుడు ప్రకృతిపై సాధించిన యీ ఘన విజయాలను గాంచి మనం ఆత్మస్తుతిపరాయణులం కాగూడదు; వుదాసీనుల మంతకంటె కాగూడదు. ఎందుకంటే మానవుడు సాధించిన ప్రతివిజయానికీ ప్రకృతి మానవునిమీద కసి తీర్చుకుంటూనే వుంటుంది. మానవుడు సాధించు ప్రతివిజయమూ మొదట్లో ఆసించిన ఫలాన్నిచ్చినదే యైననూ అటు తర్వాత దానికి కేవలం విభిన్నమై, మానవు డెన్నడూ యెదురు చూడని విషమఫలితాలు కలిగి, మొదట కలిగిన సత్ఫలితాల్నికూడ వమ్ము గావిస్తూంటాయి. మెసపొటోమియా, గ్రీసు, ఆసియామైనరు, అనేక యితరప్రదేశాలలోను మానవులు అడవులను పూర్తిగా నాశనం గావించి, పంటపొలాలను సాగు క్రిందికి తెచ్చేరు. అట్లు గావించుటలో వారు తాము కలలోనూ యెదురుచూడని విషఫలాలనిచ్చే బీజాల్ని నాటుతున్నామనుకోలేదు. కాని, ఆనాడు వారు గావించిన కృషియే ఆ దేశాలు యీనాడున్న వినాశస్థితికి కారణమైంది! అదెట్లాగంటే, అడవులే తేమను కాణాచులు; భూగర్భంలో నీటిని నిలిపియుంచు పెన్నిధుల (రిజర్వాయరుల) వంటివి. అట్టి యడవులను నిర్మూలించుటలో మానవులు యీ నీటిపట్టులను నాశనం గావించి, నేటి యెడారులకు, మరుభూములకు బీజావాపన గావించేరు. అనైచ్ఛికమే గావచ్చుగాని యిది సత్యమే. ఆల్ప్సు పర్వత శ్రేణులలోని దక్షిణ సానువులమీది దేవదారు అడవులను యిటాలియనులు నరికేస్తూ వచ్చేరు; అదే సమయంలో ఉత్తరపు చరియల్లోని అరణ్యాల నక్కడివారు భద్రంగా వుంచుతూ

వచ్చేరు; ఇటాలియనులు యీ అరణ్యనిర్మూలనంద్వారా తమ ప్రాంతాల్లోని పశుసంపదనూ, క్షీరపరిశ్రమనూ మూలచ్ఛేదం గావిస్తున్నామని భావించనేలేదు! తమ పర్వత శ్రేణుల్లోని నీటియూటలు సంవత్సరములో అత్యధికభాగము వట్టిపోవునట్లును, వర్షాకాలం కొద్ది నెలల్లోనూ అతిప్రమత్తమైన వరదలతో మైదానాలు మునిగి నాశనమైపోయేటట్లును తాము చేజేతులా చేసుకుంటున్నట్లు వారు కలలోనూ భావించి యుండలేదు! యూరోపులో వుర్లగడ్డను ప్రవేశపెట్టినవారు, పుష్టికరమైన పిండిపదార్థాన్నిచ్చే యీ దుంపతోబాటు 'స్క్రోఫ్యులా' వ్యాధిని కూడ వ్యాపింపజేస్తున్నామని తామెరుగరు! ఒక ప్రజమీద మరొక ప్రజలు దండెత్తి జయించి పాలించునట్లుగా ప్రకృతి మీద మానవులు దండెత్తి జయించి పాలించుట సాధ్యంగాదనీ, మానవుడు ప్రకృతికి అతీతుడుగా, విడిగా నిలబడి, దానిని శాసించుట సాధ్యంగాదనీ, మానవుడు తన రక్తమాంసమేదో మజ్జాదులతో సహా ప్రకృతిలోనివాడూ, ప్రకృతికి చెందినవాడూ, దానిలో అవిభాజ్యభాగంగా నివసించువాడూ మాత్రమేననీ, ప్రకృతి సూత్రాల్ని తెలుసుకొని, సరిగా ఆచరణలో బెట్టుటకు యితర జంతువులకంటె మానవునికిగల విశేషశక్తిసామర్థ్యములు గలిగియుండుటలోనే ప్రకృతిపై మానవుని అధికారం గర్భితమై వుందనీ, మనం అడుగడుగుకూ జ్ఞాపకం చేసుకొనేటట్లు మందలించబడుతూనే వున్నాము!

అంతేగాదు. ఒక్కొక్కదినం గడుస్తూన్నకొద్దీ మనం యీ ప్రకృతిసూత్రాల్ని అంతకంతకు సరిగ్గా గ్రహించ గలుగు

తూన్నాం. సహజమైన ప్రకృతి గమనంలో మానవుడు చేయి చేసుకున్నందువల్ల కలుగు తత్క్షణఫలితాల్నే గాక అనంతరఫలితాల్నీ, అప్రత్యక్షప్రభావాన్నీ కూడ చూడగల శాస్త్రీయ దృష్టినీ, శక్తినీ సంపాదిస్తున్నామనే మాటకూడా నిజమే. అందులోనూ ప్రత్యేకంగా యీ శతాబ్దంలో ప్రకృతిశాస్త్రాలు పొందిన శీఘ్రాభివృద్ధివల్ల మానవులు సాధారణంగా తాము అనునిత్యం గావించే వుత్పత్తికృషియొక్క అప్రత్యక్షఫలితాలను తెలిసికోగలిగి, అందుమూలంగా యీ గమనాన్ని తమ అధీనంలో వుంచుకోగలుగుతున్నారు. కాని, యీ కృషి యెంత హెచ్చుగా సాగుతూంటే అంత హెచ్చుగానూ ప్రకృతితో తమ ఏకత్వమునూ, అభిన్నత్వాన్నీ మానవులు అనుభూతికి తెచ్చుకొనుటేగాక తెలుసుకొనుటకూడ జరుగుతుంది; విషయి-విషయం, మానవుడు-ప్రకృతి, ఆత్మ-శరీరం, యిటువంటి ద్వైతభావంతో కూడిన ఆలోచనాసరళిలోని అసహజత్వమూ, వైరుధ్యమూ, అవ్యక్తతా మనం గ్రహిస్తాము. ప్రాచీనపౌరాణికయుగానంతరం బైలుదేరిన యీ అసహజభావం, క్రైస్తవ మతంలో బాగా విపులీకరించబడిన యీ అవ్యక్తభావం,- దీని నుంచి మానవుడు తప్పించుకొని, ప్రకృతితో తన అవినాభావత్వాన్నీ, ఏకత్వాన్నీ గ్రహించగలడు.

కాని, మన వుత్పత్తికృషియొక్క సహజఫలితము లేవైనా అప్రత్యక్షములైన అనంతరఫలితాల్ని కొంతవరకైననూ తెలుసుకొనుటకు మానవునికి వేలకొలది సంవత్సరాల అనుభవం అవసరమైంది. అట్టిచో యీ కృషియొక్క అప్రత్యక్ష సాంఘిక

ఫలితాల్ని నిర్ధారణగా గ్రహించడం యింకా కష్టతరమైనది. ఉన్నగడ్డలు-తత్ఫలితమైన స్కోన్ఫ్యూలా వ్యాధివ్యాపనమునూ గూర్చి మేము చెప్పియున్నాము. కాని, దేశాలు దేశాల్లోనే వుండే కోట్లకొలది కూలిజనాన్నంతనూ కేవలం వుర్లగడ్డలనే ప్రధానాహారంగా తీసికొనేటంతటి నికృష్టజీవితపరిస్థితులకు పాల్జేసిన వుత్పత్తివిధానవుఫలితాలనో జోల్చి చూచినా, లేక, 1847 లో వుర్లగడ్డ తెగుళ్ళవల్ల ఐర్లాండులో వచ్చిన మహాకాటకఫలితంగా పదిలక్షలమంది చావడం, యిరవై లక్షలమంది దేశాంతరాలకి వలస పోవాల్సిరావడం,- వీటితో పోల్చి చూచినా, యీ స్కోన్ఫ్యూలా వ్యాధి యెంతటి దనిపించక మానదు. అరబ్బులు ఆల్కహాలును బట్టీ పట్టుట నేర్చుకున్నాను, అప్పటికింకా కనిపెట్టబడియుండని అమెరికాఖండపు ఆదిమ వాసులను నిర్మూలించు నాయుధములలో ప్రధానమైనదానిని కనిపెడుతున్నామని వారెరుగరు! ఆ తర్వాత కొలంబసు అమెరికాను కనిపెట్టినప్పుడు, యూరోపులో అంతకు పూర్వమెప్పుడో అంతరించిపోయిన బానిసవ్యాపారాన్ని పునరుజ్జీవింపచేసి, నీగ్రో బానిసలవ్యాపారానికి అంకురార్పణ గావిస్తున్నానేమో యను అనుమానమేనా అతనికి గలదా? 17, 18 శతాబ్దాల్లో ఆవిరియంత్రాన్ని కనిపెట్టుటకు కృషి గావించినవారు, ప్రపంచమంతటా సాంఘికపరిస్థితుల్లో విప్లవాన్ని గొనితెచ్చుట కత్యంతసమర్థమైన సాధనాన్ని నిర్మిస్తున్నామని యెరుగనే యెరుగరు! అంతేగాక యీ ఆవిరియంత్రం, యూరోపులోని వస్తూత్పత్తిలో మార్పు దెచ్చి, సంపదనంతనూ కొద్దిమంది

చేతుల్లో కేంద్రీకరించి, అత్యధిక సంఖ్యాకులైన శ్రామికులను నిరాధారులను గావించి, బూర్జువావర్గానికి ఆర్థికరాజకీయాధి కారాన్నీ, ఆధిక్యతనీ ప్రసాదించుతుందనీ; అటుపిమ్మట బూర్జువా-శ్రామికవర్గాలకు ఘర్షణ దెచ్చి, బూర్జువావర్గపు ఓట మినీ, అసలు వర్గభేదాలనే సమయజేయు సమాజవిధానాన్ని సాధిస్తుందనీ, యెన్నడూ కలలోనూ భావించి యుండలేదు! కాని, యీ విషయంలోకూడా సుదీర్ఘమూ, తరచు బాధాకర మూనైన అనుభవాలద్వారాను, చారిత్రకవిషయసేకరణ, విశ దీకరణాలద్వారాను,-యిట్టి పద్ధతులవల్లనే మన వుత్పాదక కృషి యొక్క-, కర్మలయొక్క-, అప్రత్యక్ష, అనంతరకాలీన సాంఘిక ఫలితాల్ని అర్థం చేసుకోగలుగుతూ వచ్చేము; తన్మూలంగానే యీ ఫలితాలనుగూడ మన అదుపులో వుంచుకోడానికీ, కావ లసినట్లు నడిపించడానికీ కావాల్సిన అవకాశాలు సంపాదించ గలుగుతున్నాము.

ఏదేమైననూ యీ బోధకశక్తి తగు ఫలితముల నొసగునట్లు చేయాలంటే కేవలం విజ్ఞానం, చైతన్యం వుంటే చాలదు. ప్రస్తుత వుత్పత్తివిధానంలోనూ, సామాజిక విధానంలోనూ పరి పూర్ణ విప్లవాత్మకమైన మార్పుకూడా రావాలి. అప్పుడే యిందువల్ల తగు ఫలితాలు చేకూరుతాయి.

ఇప్పటివరకూ అమలులోనున్న వుత్పత్తివిధానములన్నీ కూడా, క్రమఫలితంగా తక్షణావసరములనూ, ప్రత్యక్షావసరము లనూ సమకూర్చుటయే ప్రయోజనంగా గలిగియున్నాయి. భవి ష్యత్ప్రయోజనాలు, పరోక్షావసరాలు అశ్రద్ధగా వదలివేయబడి

నాయి. తరతరాలుగా కూడబెట్టడం, యెడతెగని కృషీ అవసరమైన విధానాలపట్ల ఔదాసీన్యమే వహించబడింది. ఆదిమకాలంలో వుండియున్న సమిష్టిభూస్వామ్యవిధానం యెటువంటిది? అప్పటి మానవసమాజాభివృద్ధిదశకు అనుగుణ్యమైనదే. ఆ దశలో మానవుల దృష్టి సాధారణంగా తక్షణ, ప్రత్యక్షావసర విషయాలలోనే లగ్నమై వుండేవి. అంతేగాక సుగోస్తైవున లభ్యంగా వున్న భూమి అవసరాలకన్న అత్యధికంగా వుండేది. ఈ అంచనాల మీద ఆధారపడే ఆనాటి సమిష్టి భూస్వామ్యం నిర్మించబడింది. ఈ ప్రాచీన ఆర్థికనిర్మాణంలో సంభవం కాగల యే అవాంతరాలకైనా, దుష్ఫలితాలకైనా తగినంత అవకాశాన్ని వదలిపెడుతూనే యిది నిర్మితమై సాగిపోతూండేది. కాని, యెప్పుడైతే యీ అదనపుభూమి హ్రస్వమైపోనారంభించినదో అప్పటి నుంచీ యీ సమిష్టి భూస్వామ్యం కూడా సన్నగిలుతూ వచ్చింది. ఏ దేశమైననూ, వున్నతమైన వుత్పత్తిపద్ధతులన్నీ కూడా ప్రజలను వివిధతరగతులుగా విభజించుతూవచ్చి, తన్మూలంగా పాలక - పీడిత తరగతులమధ్య వైరుధ్యాన్ని కల్పిస్తూనే వచ్చాయి. మొత్తంమీద పాలకవర్గంయొక్క ప్రయోజనాలే వుత్పత్తిని కొనసాగించేటందుకు ప్రేరకశక్తిగా వుంటూ వచ్చినాయి. అదైనా కొన్ని పరిమితులకు లోబడే; పీడితప్రజలు జీవించియుండడానికి తప్పనిసరిగా అవసరమైనంతవరకే యీ వుత్పత్తి నిరాటంకంగా వుండగలిగేది. పశ్చిమ యూరోపులో నేడు సాగుతూన్న పెట్టుబడిదారీవిధానంలో యిది పరిపూర్ణరూపంలో చూడగలము. ఉత్పత్తినీ, పంపకాన్నీ పూర్తిగా తమ స్వాధీనమందుం

చుకున్న పెట్టుబడిదారీవ్యక్తులు, తమ కార్యములయొక్క తక్షణోపయోగఫలితాల్ని గూర్చి మాత్రమే తలపోయగలరు. బహుశః యీ వుపయోగఫలితాలైనా పూర్తిగా పరిగణనకు రావడమే లేదు; ఉత్పత్తి లేక పంపకం చేయబడిన వస్తువు యొక్క వాడకపు సమస్య తరచుగా మరుగున పడిపోతూ, దాన్ని అమ్మడంవల్ల వచ్చే లాభాల పరిగణనమే ప్రప్రధానమై కూర్చుంటూంది....

బూర్జువావర్గంయొక్క సాంఘికశాస్త్రం, ప్రామాణిక అర్థశాస్త్రం కూడా వస్తూత్పత్తి పంపకాలకు సంబంధించినంతవరకు మానవచర్యలయొక్క ప్రత్యక్షోద్దేశాలనూ, సాంఘికఫలితాలనూ గూర్చే ముఖ్యంగా చర్చిస్తాయి. ఈ అర్థశాస్త్రము యే సామాజికనిర్మాణపు సిద్ధాంతప్రతిబింబమో గ్రహించినట్లైతే, యిది ఆ సామాజికనిర్మాణానికి అనుగుణంగానే వుందని తెలుస్తుంది. తక్షణ లాభాలకొరకే పెట్టుబడిదారీవ్యక్తులు వుత్పత్తి వినిమయాల్లో నిమగ్నులై వుంటూన్నంతవరకు ఆర్థికవిధానపు పునాదిగా తాత్కాలిక, తక్షణలాభాలే పరిగణించబడతాయి. పారిశ్రామికుడు గానీ, వర్తకుడు గానీ, తానుత్పత్తి చేసిన వస్తువునో, మారుబేరానికి కొన్న వస్తువునో కొంత లాభానికి అమ్మడంతో సంతృప్తుడవుతున్నాడు: ఆపిమ్మట కొనువాడేమిచేస్తాడా,-ఆ వస్తు వేమవుతుందా, అనేదాతని కవసరం లేదు. మానవ చర్యల వల్ల కలుగు సహజప్రతిక్రియల విషయంలో కూడా యిదే సూత్రం వర్తిస్తూంది. క్యూబా ద్వీపంలోని కాఫీతోటల స్పానిష్ యజమానులు పర్వతాలమీది అడవుల్ని తగులబెట్టి,

తమ తరానికి సరిపడు బూడిదయెరువును సమకూర్చుకొని, కాఫీ పంటను బెట్టి అమితలాభాలను సంపాదించేటప్పుడు నా కేమి ఆలోచిస్తున్నారు ?—అటుపిమ్మట ఉష్ణదేశాలలో కురిసేటి సంఘనవృష్టుల మూలమున యీ నగ్నపర్వతాలమీది పైపొర మట్టి కొట్టుకొనిపోయి బోడికొండలుగా, బండరాళ్లుగా మిగిలినాయి. తమ లాభాలనే చూచుకొన్న కాఫీతోటల యజమానులు కొంచెమైనా పట్టనేలేదు! సాంఘికంగానూ, అట్లే ప్రాకృతికంగానూ కూడా, ప్రస్తుతోత్పత్తివిధానము ప్రధానంగా తక్షణఫలితాలను గూర్చి మాత్రమే తాపత్రయపడుతూంది; తాత్కాలికలాభాపేక్షతో చేయు కార్యములకు అటుపిమ్మట విభిన్నఫలితాలు,— అంతేగాదు, కేవల వ్యతిరేక ఫలితాలే కలుగుతూన్నప్పుడు విస్మయంతో జౌడు గరుచుకుంటున్నారు, మానవులు; వస్తూత్పత్తి వినిమయాలు సామరస్యంగా, తుల్యంగా వుండడానికి మారు, ఉత్తరదక్షిణధృవాల మాదిరిగా పరస్పర విరుద్ధము లవుతున్నాయి. పారిశ్రామిక వృత్తిలో ప్రతిదశాబ్దానికీ వచ్చే సంక్షోభమాంద్యాల్ని గమనిస్తే, అందులోనూ జర్మనీకూడా నేడు* అనుభవించుతూన్న తాకిడిని చూస్తేనూ యీ విషయం స్పష్టంగా తెలుస్తుంది; ప్రత్యేకాస్తి విధానముతో గూడిన వ్యక్తి శ్రమ, తప్పనిసరిగా శ్రామికులను నిరాస్తిపరులను గానూ, శ్రమచేయనివారిని సమస్త సంపదలకూ అధికారులు గానూ చేయడానికే దారితీస్తుంది; అంతేగాక, అది...... ♦

* 1873-74 నాటి జర్మనీ ఆర్థికసంక్షోభాన్ని ఉద్దేశించి ఏంజిల్సు చెప్పినది.

♦ హఠాత్తుగా యిక్కడితో వ్రాతప్రతి నిలిచిపోయివున్నది: ప్రకాశకులు.

అంతకంటె గొప్పవా డవుతూన్నాడు.... ఇది చదివితే ప్రకృతి శక్తుల్ని జయించుకోగలం అను వుత్సాహం మనకు కలుగక తప్పదు. పైగా జగన్మోహనరావు గారు తమ అనువాదంలో మూలంనుంచి ముక్కకు ముక్క తెలిగించి వ్రాయలేదు; ఆంధ్ర ప్రజల అనుభవంలోని విషయాలను చాలవరకు వుదహరిస్తూ వచ్చేరు.... ఈ పుస్తకం ఎన్నిసార్లు చదివితే అంత విజ్ఞానం, అంత ఆత్మవిశ్వాసం, ఉత్సాహం పెరుగుతాయి."

[ శ్రీ గోపరాజు రామచంద్రరావు గారు "ఆర్థిక సమత" అను తెలుగు వారపత్రికలో 31–7–53 న వ్రాసిన పుస్తక పరిచయం నుంచి. ]

★ ★ ★ ★ ★

"....ఇంచు మించు ప్రకృతిశాస్త్ర రహస్యాల నన్నిటినీ ఇలిన్ నేర్పుగా, శాస్త్రీయపద్ధతిలో యీ గ్రంథంలో సంపుటీకరించి వివరించాడు. క్రమక్రమంగా వికసిస్తూ వస్తున్న విజ్ఞాన శాస్త్ర సారాంశాన్ని కథల రూపంలో ఆసక్తి జనించేట్లు గ్రంథ రచన ఆదినుండి తుదివరకూ కొనసాగింది.... ఇలిన్ ప్రతిభ అనన్య సామాన్యమైనది. విషయాన్ని చెప్పే తీరు ఆసక్తిని కలిగిస్తున్నది. అనువాదం సరళంగా, తేటగా, చక్కని శైలిలో సాగింది. వివిధ శాస్త్రీయ విషయ ప్రాధాన్యత గల గ్రంథాలు తెలుగుభాషలో తక్కువ. క్లిష్టమైన శాస్త్రీయ విషయాలను కథలవలె సుబోధక శైలిలో రచియించిన యిట్టి గ్రంథాలనేకం నేడెంతేని అవసరం।"

[ శ్రీ అవసరాల సూర్యారావుగారు 'విశాలాంధ్ర' దినపత్రికలో 9–8–53 న వ్రాసిన గ్రంథపరిచయం నుంచి. ]

మహాకవి మాగ్జిం గోర్కీ దీనికి తొలిపలుకు వ్రాస్తూ "ఇది ఒక మహాగీతం।" అన్నారంటే యీ గ్రంథ ప్రాశస్త్యం వేరే చెప్పాలా?

నేడే యీ గ్రంథాన్ని తెప్పించి చదవండి.

విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

**VANARUDU - NARUDU** (Engels) **As. 6**

Trans: JAGANMOHAN RAO. M.

Pub:- **Viswasahityamala - Rajahmundry.**



## సిద్ధముగానున్న గ్రంథాలు:

| | | | |
|---|---|---|---|
| మానవులు-మహీధరములు (ఇలిన్) | రు. | 5 | 0 |
| ప్రకృతి : గతితర్కం (ఏంజిల్సు) | | 0 | 10 |
| కారల్ మార్క్సు ఉపదేశాలు (వి. ఐ. లెనిన్) | | 1 | 0 |
| ఆచరణ (మావ్-త్సె-టుంగ్) | | 0 | 6 |
| ప్రబల ప్రజాతంత్ర నియంతృత్వం (మావ్-త్సె-టుంగ్) | | 0 | 8 |
| దక్షిణ పవనం (స్టాలిన్ ప్రైజు నవల) | | 4 | 8 |
| వామపక్ష కమ్యూనిజం : బాల్యారిష్టం (లెనిన్) | | 2 | 0 |
| వానరుడు-నరుడు : పరిణామక్రమంలో కర్మపాత్ర (ఏంజిల్సు) | | 0 | 6 |
| విజ్ఞాని పావ్లోవ్ (జీవితము - నాటకము) | | 2 | 8 |
| లెనిన్ జీవితకథలు (18 బొమ్మలతో - పిల్లలకు) రెండోకూర్పు | | 1 | 0 |
| గోర్కీ జీవితం (బొమ్మలతో-రెండోకూర్పు) | | 2 | 0 |
| విప్లవ సందేశం (4 కూర్పు) | | 0 | 8 |
| లెనిన్ ఉపదేశాలు (రెండోకూర్పు - పామీపత్తు) | | 1 | 0 |
| ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర (రెండోకూర్పు - ఒకేసంపుటి) | | 1 | 4 |
| బలిదాన్ (సోవియట్ నాటకం) | | 1 | 0 |
| సోవియట్ ప్రజాస్వామ్యం (రెండోకూర్పు) | | 0 | 12 |
| నాద్యా (వివిధదేశాల కథలసంపుటి) | | 1 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు (పది కథలు) మూడోకూర్పు | | 2 | 0 |
| గోర్కీ కథలు (ఆరు కథలు) | | 1 | 8 |
| యక్షప్రశ్నలు (చిక్కుప్రశ్నలు-శాస్త్రీయ సమాధానాలు) | | 2 | 0 |
| డిప్యూటీ ఛైర్మన్ (చీనా విప్లవ కథలు) | | 1 | 0 |
| ప్రతీకార జ్వాలలు (నవల - రెండోకూర్పు) | | 1 | 0 |
| రాజ్యాంగ యంత్రం (లెనిన్ రచన; రెండోకూర్పు) | | 0 | 4 |
| ఇండియా (మార్క్సు, ఏంజిల్సు) | | 1 | 0 |
| చీనా కథలు (అస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్) | | 1 | 0 |

వలయువారు:- విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

PRINTED AT AVANTI PRESS - RAJAHMUNDRY.